శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః
శ్రీమతేరామానుజాయనమః
శ్రీగోదాయై నమః

# శ్రీగోదాసూక్తిమాల

(శ్రీ ఆండాళ్ సాయించిన నాచ్చియార్ తిరుమొళికి
ఆంధ్రానువాదము)



రచయిత :
తి. విం. పార్థసారథి అయ్యంగార్.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీగోదాయై నమః

# శ్రీగోదాసూక్తిమాల

(శ్రీ ఆండాళ్ సాయించిన నాచ్చియార్ తిరుమొళ్ళికి
ఆంధ్రానువాదము)




రచయిత :

తి. విం. పార్ధసారధి అయ్యంగార్.

H.No. 1-24/4,
శ్రీకల్యాణ నిలయం,
ప్రభాత్‌నగర్, చైతన్యపురి,
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు - 60.

This book is published with the financial assistance of the
T.T.Devasthanams under their scheme.
Aid to Publish Religious Books.

ప్రథమ ముద్రణ

ప్రతులు 1000

ఈశ్వర సం. శ్రావణ మాసం

1997

మూల్యము ఉచితము.



ముద్రణ :
సాయిశ్రీ ధనలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు.

# శ్రీమతేరామానుజాయనమః

## కృతజ్ఞతానివేదనము

1994 సం.రం. నేను కొవ్వూరులో నున్నప్పుడు నారచించిన స్తోత్రలహరిని ప్రచురించు సందర్భమున శ్రీమద్రామానుజసేవా సమితి సంచాలకులు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యాపకులు, విద్వన్మణులగు డా. శ్రీమాన్ సముద్రాలరంగరామానుజాచార్యులు M.A. Phd, గారు నా రచనలపై తమ అభిప్రాయమును వెల్లడించుచు నేనేదేని శ్రీ వైష్ణవ సంప్రదాయప్రసిద్ధమైన తమిళ దివ్యప్రబంధ పాశురములను తెనిగించిన బాగుండునని తమ ఉద్దేశమును వెలిబుచ్చిరి. నామాతృభాష తమిళమే అయినను ఆభాషా పరిజ్ఞానమునా కంతగాలేదని, పైగా ద్రావిడామ్నాయమని కొనియాడబడి భాగవతోత్తములచేనిత్యానుసంధానము కావింపబడు ఆళ్వారాదులపాశురములనాంధ్రీకరించుట నావంటివానికి అసాధ్యమని చెప్పగా, వారు శ్రీ గోదాదేవి కృపచేసిన నాచ్చియార్‌తిరుమొళి కొంత సులభతరము కావున దాని ననువదింప ప్రయత్నింపుమని సలహోయిచ్చిరి.

శ్రీగోదాదేవి పాయించిన నాచ్చియార్ తిరువెుళి కూడ తత్కృతమైన తిరుప్పావువలె సుప్రసిద్ధమైనదే. ద్రవిడ దేశములో శ్రీవైష్ణవుల వివాహసమయమున నేడును దీనిలోని ఆరవదశకమును తప్పక శీర్పాడల్ అని మాత్నవధూవరులచే కొబ్బరి కాయలతో వాడించు సందర్భమున ననుసంధింపబడుచున్నది. దీనికి తెలుగులో కూడ పెద్దలు కొందరు వచనవూర్వక వ్యాఖ్యలు. టీకాతాత్పర్యములు వ్రాసి ప్రకటించి యున్నారు. ఆయినప్పటికి ఆంధ్రమున ఛందోబద్ధముగా ప్రతి పాశురము ననువదించిన శాశ్వతముగా నుండునని నాకుతోచినది.

కనుక అందులకుద్యుక్తుడనై తద్రచనా శక్తి ననుగ్రహింపుమని శ్రీ గోదాదేవిని మనసార ప్రార్థించితిని. ఆ తల్లి కృపాకటాక్షము వలన , పెద్దలయాశీస్సుల వలన, మత్పురాకృత సుకృతము వలన నా ప్రయత్నము సఫలమైనది. కాని ఒక ప్రాచీన భాషలోని మహాకావ్యమును మరొక భాషలోనికి పద్యరూపమున వ్రాయునపుడు దానిలోని ప్రతిపదార్థమును, భావమును విడువకుండ యధాతథముగా అనువదించుట కష్టతర మని మనీషులకు వేరుగా చెప్పఁబనిలేదు. అయినను నా శక్తి కొలదితద్విశిష్ట్యము తెలుగు వారికర్థమగు నట్లు సులభశైలి నందించుటకే ప్రయత్నించితిని. నారచనలో నేవేని దొసంగులు పొసంగిన పండితులు నన్ను మన్నింతురుగాక.

ఈ చిన్ని పొత్తమును,సుప్రసిద్ద విద్వాంసులు ప్రవచన శిరోమణి, ఉ.వే. ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు గారికి పంపి వారి ఆశీస్సులు కోరగా నామహనీయులు నాయందు కృపయుంచి భవ్యామోదమను శీర్షికతో వివరించుచు నన్నాశీర్వదించి నారు.

ఏతద్రచనను ప్రోత్సహించిన శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్యులు గారికి, అనుపమమైన తమ మంగళా శాసనమును దయచేసిన శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారికి పరశ్శతాభి వందనములు చేయుచున్నాను.

నేను కోరిన వెంటనే నా ప్రార్థనమునంగీకరించి తమ యమోఘ మంగళాశాసనమును స్వహస్తములతో లిఖించి యనుగ్రహించిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ త్రిదండి శ్రీ మన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారికి వినమ్రుడనై అనేక దండ ప్రణామములర్పించుచున్నాను.

ఈ కావ్యమును ఆంధ్ర ప్రబంధసాహితీ ప్రపంచమున కందించు మహద్భాగ్యమును, తన్ముద్రణమునకు అగు ధన సహాయమును నాకు ప్రసాదించిన శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దివ్య చరణార విందములకు భక్తి ప్రపత్తి పూర్వకము గా సాగిలి నమస్కరించుచు, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నాకృతజ్ఞత తెలుపు కొనుచున్నాను.

ఈ పుస్తకమును సరసముగా చక్కగా ముద్రించియిచ్చిన శ్రీ ధనలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి నా ధన్యవాదములు

ఇట్లు

బుధజన విధేయుడు

తి. విం పార్థసారధి అయ్యవార్.

## పండితాభిప్రాయము

సాహిత్య విద్యాప్రవీణ డా. సముద్రాలరంగరామాను జాచార్యులు గారు **M.A. Phd,** , సంస్కృత లెక్చరర్, **S.V.J.V.S.** కాలేజి, కొవ్వూరు, ప.గో జిల్లా.

"తమిళ భక్తి సారస్వతంలో అనర్ఘమణి అయిన నాచ్చియార్ తిరుమొళి అనే కావ్యాన్ని శ్రీ గోదాసూక్తిమాల అనుపేరదాదాపు 150 పద్యాలలో శ్రీ పార్థసారధి అయ్యంగార్ సుందరంగా మధుర భక్తి ప్రధానంగా అనువదించారు. దీనిని చదివిన వారి కిది అనువాదంగాగా కస్వతంత్ర కావ్యంగానే అనుభవగోచరం కావడం యీరచనయొక్క విశిష్టత ."

"ప్రవచన శిరోమణి" ఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం
అప్పలాచార్యులుగారి ఆశీస్సులు

శ్రీ గోదాదేవ్యై నమః

ఆండాళ్ తిరువడిగళే శరణమ్

# భవ్యామోదము

శ్రీ ఆండాళు తాయారు సకల చేతనోజ్జీవనార్థము అవతరించిన భూదేవి. చేతన ప్రతినిధియై మానవుడు పొందవలసిన పరమ పురుషార్థమును నిరూపించి దానిని పొందు సాధనానుష్ఠానము తానే ఆచరించి చేతన కోటిని ఉజ్జీవింపజేసినది ఆండాళు. 'ఉన్దన్నోడుత్తోమేయావోమ్, ఉనక్కే నామాట్ చెయ్‌వోమ్' నీతోనే నిత్యసంబంధము కల వారము కావలెను, నీకే కైంకర్యము చేయువారము అగుదుము గాక'. అని ఆండాళు తమ తిరుప్పావై ప్రబంధము లో పురుషార్థ నిర్ణయము చేసినది. భగవన్నిత్య సన్నిధి నొంది నిత్యకైంకర్యము చేయుటయే కోరుకొనదగిన పురుషార్థము.

తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అను రెండు దివ్య ప్రబంధములు కృపచేసిన ఆండాళు పురుషార్థమును పురుషార్థ సాధనమును ప్రకాశింపజేసినది. భగవదనుభవ జనిత ప్రీతికారి తా శేషావస్థోచితా శేషశేషతైక రతిరూపనిత్యకైంకర్యము పొందదగినపురుషార్థము, భార్యాభర్తృ సంబంధమున ప్రకాశించు సంబంధత్రయము ఆత్మకు సిద్ధించవలెను. అనన్యార్హశేషత్వ, అనన్యశరణత్వ, అనన్య భోగ్యత్వములే భార్యకు స్వరూపము. అదే ఆత్మ స్వరూపము. అది సిద్ధించుట భార్యాత్వ సిద్ధి స్వస్వరూపసిద్ధి. దానినే కాంక్షించి వ్రతము చేసినది ఆండాళు. ముప్పది రోజుల వ్రతమే తిరుప్పావై.

అటు కాంక్షించిన భగవదనుగ్రహము లభించక అతిశయించిన ఆర్తితో పరభక్తి పరజ్ఞాన పరమభక్తి దశలనంది మానసికమైన ఆర్తితో అధ్యవసాయముతో ఉండలేక చేసిన ఆర్తనాదమే "నాచ్చియార్‌తిరుమొళి". అనన్య ప్రయోజనయై భగవదేవోపాయత్వాధ్యవసాయముతోనున్న ఆండాళు ఉద్విగ్న చిత్తయై భావబంధముత్కటమైన తన స్వరూపమునకు విరుద్ధమైనను కామ దేవారాధన చేసి యైనను భగవానుని పొందవలెనని సిద్ధపడినది.

నాచ్చియార్ తిరుమొళి ఒక మహాకావ్యము. కాళి దాసాది మహాకవులకు ఇది మార్గదర్శకమైనది. కామదేవునారాధించును. ప్రశ్న చెప్పించుకొనును. కూడల్ అను ప్రశ్న చెప్పించును. మేఘమాలను దూతగా నంపును. కలలో పరిణయము శ్రీరంగనాథునితో జరిగినట్లు దర్శించును. ఇందలి భావ సౌందర్యము, ప్రకృతి వర్ణనము వృత్తమాధుర్యము, పదగుంఫనము, అర్థసౌష్ఠవము, అనుభవైక వేద్యములు.

శృంగారమున కన్పడు చక్షుఃప్రీతి మనస్సంగస్వప్నాది వివిధావస్థలు ఇందు మనకు కన్పడును. కావ్యముగా మధుర గంభీరోదార మహాకావ్యము.

అట్టి కావ్యమును సిద్ధహస్తులైన శ్రీమాన్ పార్థసారధి అయ్యంగార్ ''శ్రీగోదా సూక్తిమాల'' అనుపేర అనువదించి ఆ రసవత్తర భావపరంపర ఆంధ్రులకందునట్లు చేసినారు. వారిది అనువాదముకాక సహజముగ సాగినది. ఛందస్సు, భాష, భావావిష్కరణము మనోజ్ఞములు.

ప్రథమ దశకమున కామదేవారాధన, ప్రార్థన చేసినారు. ఆర్తి అతిశయించునప్పుడు ఇది రక్షకముగు నాకాదాయను ఆలోచన యుండదు. లోకములో స్త్రీ పురుషులను కలిపెడు వాడు మన్మథుడు కదా అని పరమపురుషునితో తనను చేర్పుమని అర్థించును. మనసులలోని భావములలో మార్పుతెచ్చువాడు మనసిజుడు కనుక ప్రేమనాతడు తీవ్రతరము చేయును. ఆచార్యుడు కూడ ఘటికుడై పరమ పురుషుని మనసులో దయను కల్గించి జీవుని హృదయములో ఆర్తి పెంపొందించి ఇద్దరిని చేర్చును. అట్టి ఆచార్య సమాశ్రయణమే ఇందు కామదేవార్చన.

వినోదమునకై తాము కట్టుకొనిన బొమ్మరిండ్లను కూల్చవలదని రెండవ దశకమున ప్రార్థింతురు. తనను విడవి వేరొక దానిచే ప్రొద్దు పుచ్చుకొనెడి మనస్థితిని సర్వేశ్వరుడు సహించడు. అనవరత నిత్యభావన సాగునట్లు అనుగ్రహించుట ద్వితీయ శతకము.

మూడవదశకమున గోపికలుగా తమ్ము భావించుకొని తాము చేసిన దేవహేలనమును క్షమించి సరస్సులో నగ్నలుగా నున్న తమకు వస్త్రములొసంగుమని యర్థించినారు. భగవద్ద్రోహము చేసి భగవానుని పొందవలెనను ఆర్తిచే వరుణుని హేలనము చేసినట్లు దిగంబరయై స్నానమాడుట వ్రతము ఫలింపకుండ చేయును. దానిని తొలగించునట్లు ''సర్వపాపేభ్యోమోక్షయిష్యామి'' అని సర్వేశ్వరునే అర్థించి తొలగింపజేసికొనవలెను అని ప్రార్థించినారు.

వధూవరుల పొంతనము చూచుటకు సున్నలు కూడి జ్యోతిష్కులు ఫలితము చెప్పుచుందురు. సున్నాల కూడిక యేమనుచున్నదో అని ఆండాళు ప్రశ్నించుచున్నట్లునాల్గవ దశకమున వర్ణింపబడినది. ప్రేమ హద్దులు మీరినపుడు పరమ పురుషునే ఉపాయముగా ఆశ్రయించిన వారు చేయరాని పనులను చేయుట తప్పుగా తోచును. కాని అది భక్తి యొక్క అతిశయమును సూచించును గనుక పరమ శ్లాఘ్యమేయని శ్రీవచన భూషణ శాస్త్రము.

అయిదవ దశకమున కోకిలను తనగానముచే ప్రియుని ఆకర్షింపుమని ప్రార్థించును. మత్తకోకిల ప్రార్థనము కనుక తెనుగులో మత్తకోకిల ఛందస్సు నవలంబించుట మనోహరము.

జాగ్రదవస్థ గడచి ఎట్లో నిద్రపట్టినది. ఆండాళుకు కల వచ్చినది. అపుడు కూడ భావ బంధము అనువర్తించియే యుండును. కనుక కలలో శ్రీరంగనాథుడు వచ్చి అగ్ని సాక్షికముగా పరిణయము చేసికొనుట చూచెను. సప్తపది, సన్నికల్లు తొక్కుట మొదలగునవన్నియు కన్పడెను. దానిని చెలితో ఆండాళు చెప్పినది ఆరవ దశకములో.

ఏడవదశకములో ప్రేమలో ప్రలాపావస్థలో శంఖము స్వామి అధరమును, మోవిని స్పృశించి ఆస్వదించును కావున పాంచజన్యమా ! మాధవాధరసుధారస మాధురి చెక్కెర వోలెనుండునా ! దాని పరిమళము పద్మమువలెనుండునా ! కర్పూరము వలెనుండునా ! యని శంఖమునడుగుచు దానితో సంభాషించును.

ఎనిమిదవ దశకమున వేంకటాచలమున నుండి సాగుచున్న మేఘమును చూచి సందేశమును చెప్పి వేంకటాచలపతితో చేర్పుడని ప్రార్థించును. ఇది యే మేఘదూతమునకు మూలము.

తొమ్మిదవ దశకమున తిరుమాలిరుంజోలైయను దివ్యదేశమున సుందర బాహుస్వామితో తనను చేర్చుడని అచటి తుమ్మెదలను లతలను ప్రార్థించును. ఉన్మత్తావస్థవలెనుండు దశ అనుభవించినది. తాను సమర్పించిన దారగించినచో నూరుగంగాళముల పరమాన్నమర్పించెదనని మ్రొక్కును.

పదవదశకములో భగవద్విరహవ్యథ కోపలేక పరితాపముతో విలపించును.

పదునొకటవ దశకమున తన వైవర్ణ్యమును కార్శ్యమును చూచికొని ఆనాడు శ్రీరాముడుగా శ్రీకృష్ణుడుగా ప్రియురాండ్రకై పడిన శ్రమలను అనుగ్రహించిన

విధమును తలంచికొని తన యెడల అట్టి దయామూర్తి దయప్రసరింపలేదని శ్రీరంగనాధుని ఉపాలంభించును.

పంద్రెండవ దశకమున చెలికత్తెలతో భక్తివిలోచనమున నున్న స్వామితో తనకున్న అనన్యార్హ సంబంధమును తెలిపి అచటికి తనను చేర్పుడని చెలులను అర్థించును.

పదమూడవ దశకమున ఆ శ్రీకృష్ణుడు ధరించిన వస్త్రమునో తులసిమాలికనో తనకు ఒసంగుమని ప్రార్థించును. విరహ తీవ్రతలో ప్రియుడు స్పృశించిన దానిని తాను చూచుట కూడ తాపమును ఉపశమింపజేయును. అట్టి చివరి దశకు చెందిన అవస్థ ఇందు వర్ణింపబడినది.

పదునాల్గవ దశకమును బృందావనమునుండి వచ్చిన వారిని గోదాదేవి శ్రీకృష్ణుని చూచితిరా అని ప్రశ్నింపగా వారు చూచితిమని చెప్పుట. ఉత్తరప్రత్యుత్తర రూపముగా సాగినది. తరువాత ఆమె శ్రీరంగనాధునితో కళ్యాణమై నిత్యసాన్నిధ్యమందినది.

ఇట్టి మహాకావ్యముగు నాచ్చియార్ తిరుమొళి యను దివ్యప్రబంధమును 'శ్రీగోదాసూక్తిమాల' గా తెలుగు వారి కందించిన శ్రీ పార్థసారధి అయ్యంగారు ధన్యులు. వారి వాక్కు చరితార్థము. తెలుగునాట ఆళ్వార్ల దివ్యప్రబంధమాధురిని అందించునట్లు శ్రీ గోదాదేవి వారిని అనుగ్రహించుగాక.

8-11-94,
ఎ61, షీలానగర్,
విశాఖపట్టణము.

ఇట్లు
శ్రీ భాష్యంఅప్పలాచార్యులు

# శ్రీ గోదాయై నమః



శా : నీలాతుంగపయోథరాచలతటిన్ నిద్రించు శ్రీకృష్ణుగో
పాలున్ లేపి స్వకీయ మాల్యనిగళీబద్ధాంగునింజేసివే
దాలందెల్పిన పారమార్థ్యమును నధ్యాపించు.-చానందలీ
లాలోలాత్మతనొప్పుగోదకునతుల్గావింతునెల్లప్పుడున్

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ గోదాయై నమః

# శ్రీ గోదా సూక్తి మాల

## మొదటి దశకము : (నాచ్చియార్ తిరుమొళి)

1. ఉ. ఇమ్ముగఁ బుష్యమందుకమలేక్షణుఁ డేఁగెడు త్రోవనూడ్చి శు
భ్రమ్మొనరించి ముగ్గులును రంగులుఁ దీర్చితి - మాఘశుక్ల ప
క్షమ్మునఁ జక్కఁగాని సుముఁ జల్లితి. సాంబుని నిన్నుఁ గొల్చితిన్
సమ్మతివేంకటేశునకు నాకును పొందు ఘటింపు మంగజా !

2. మ. మదనా ! వేగకమున్న లేచి సికతా మార్గంబు నిర్మించి క్రుం
కెద ఁ గూలంకష -నాపయిన్ సమిధ లగ్నిన్ వ్రేల్చియర్చింతు - నీ
మృదుపుష్పాశుగపంక్తి తోడనను ఁ బేర్మిన్ జేర్చి - రాజద్గుణా
స్పదుఁడౌ నందకుమారుపై ఁబఱపి తత్సాంగత్యమున్ గూర్పుమా !

3. మ. స్ఫురదున్మత్తపలాశపుష్పములతో ముప్ప్రొద్దులున్నేను క్ర
చ్చుఱ నీపూజలొనర్తు - నాయెడఁ గృపాస్వాంతుండవై మన్మథా !
త్వరగా నీదు నిశాత పంచశర సంధానంబు గావించి సుం
దరమౌ వేంకటనాథుదీపరుచితో నన్నైక్యమున్ జేయుమా !

4. మ: నినుఁగుడ్యంబులపై లిఖించిమరుడా ! నీతోడుగా మీనకే
తనమున్ గీరము నించు నిల్లు విరులున్ దన్వంగులన్ వ్రాసినీ
కొనరన్ జూపితి. నాదు జవ్వనము నా యుప్పొంగు చందోయికృ
ష్ణునకర్పించితి ఁ బేర్మిమైనతని పొందున్ నాకు గల్గింపుమా !

5. మ : స్మరుఁడా ! యాగములందు దేవవరులాస్వాదింపఁగా భూమిని
ర్జరులర్పించుహవిస్సుజంబుకములాఘ్రాణించినన్ వ్యర్థమౌ
కరణిన్, శ్రీపతి కంకితంబయిననాకాయంబు వక్షంబునె
వ్వరికిన్ దక్కదు - దక్కినన్ నిలువదీ ప్రాణంబునేమాత్రమున్ -

6. మ : ప్రతి నిత్యంబును సుందరీమణుల తోడ్పాటొంది మార్గంబునే
నతి శుభ్రంబొనరించి ఫాల్గునమునందత్యంత సంప్రీతి నీ
వ్రతమున్ నోచెద - నీరదాంగుఁడత సీవర్ణుండు పుల్లాంబుజ
ప్రతిమాస్యుండగు వాని వీక్షణమునా పైఁ బర్వఁగాఁ జేయుమా !

7. మ. చెఱకుంబ్రాలు గుడంబురుచ్యముగుగోక్షీరంబు నర్పించి భూ
సురమంత్రంబుల తోడఁ జేసెదను నీ స్తోత్రంబు - ముల్లోకముల్
పరఁగన్ గొల్చిన యాత్రివిక్రమునురోభాగంబు నావక్షముల్
బరిరంభం బొనరించు భాగ్యగరిమల్ బంచాస్త్ర! నాకీయవే !

8. చ. తలవిరియంగఁ బోసికొని తద్దయు నోష్ఠము వెల్లవారఁగా
మలిన శరీరమూని యొక మాటు భుజించుచు నేమమారనే
సలుపు వ్రతమ్ము విన్ముసుమసాయక ! నిత్యము నమ్ముకుందుని
ర్మల చరణాబ్జమొత్తు పరమార్థము నాకు ఘటిల్లఁ గావుతల్

9. మ. నిను ముప్పొద్దుల మ్రొక్కి నిర్మల సుమానీకంబులర్పించి నీ
వినుతింజేసెదనయ్య ! మాధవుని సేవింపంగఁ బ్రాల్మాలినేఁ
దనువుల్ బాయుదునేని నయ్యఘముగోత్రల్ దున్ను మేలైన యెం
ద్దును బాధించిన వాని చందమునఁ జెందున్ నీకుఁ దథ్యంబుగల్

10. సీ. విరికోలలును నించు విలుబూని ప్రజలను
రులొ్కొల్పు స్మరుని యంఘ్రులకు మొక్కి;
కంసుమోసలనున్న గంధగజేంద్రము
మదమడంచి యుదానిరదములూడ్చి,
యతివంచకుండైన యాబకాసురుఁ బట్టి
రెండుగా వాని నోరిని పగిల్చి,
గోపబాలురు మెచ్చు గోవర్ధన మహాధ
రిత్రీధరముఁ గొన వ్రేలనెత్తి,

గీ. : నట్టి కృష్ణుని తో నైక్యమందగోరి
విష్ణుచిత్తుని పుత్రియై వెలయుగోద
ద్రవిడబాషనొనర్చినస్తవము దీనిఁ
జదువు వారికి హరి కటాక్షంబు గలుగు

**రెండవదశకము :**

1. మ : వనజా తేక్షణ ! వేయినామముల విశ్వంబెంచు సర్వేశు, నిఁ
గని మాయత్త యశోదడెందమున నానందించె - మాకుఁ శమిం
చునె తాపంబు, వసంతమున్ దఱియునంచుఁ ఫాల్గునంబంద య
ల్లిన మార్గంబులలంకరించెదము -- కూల్పఁ బోకుమా యిమ్ములన్

2. ఉ. ఈదినమెల్ల కష్టపడి యీబొమరిండ్లను కట్టినాముదా
మోదర ! నీవ మమ్ము తగఁ బ్రోవవలెఁ - వటపత్రమందుక్షీ
రోదధిఁ బవ్వళించి జగదుద్భవముఁ బొనరించు నీకు మా
పై దయకల్గ దెందులకొ ! పాపమదేమి పొనర్చినారమో ?

3. మ. నరహర్యక్ష ! యుగాధవార్ధిశయనా ! నాగేంద్రసంరక్షకా !
కరమర్థింతుము మమ్మునొంపకు కటాక్షస్ఫారబాణావళిఁ
బరమశ్రద్ధ వహించి సూక్ష్మసికతా భాగంబులందెచ్చిమా
యిరవుల్ కట్టితిమయ్య ! కూల్పవలదీయిండ్లఁ గృపా సాగరా !

4. ఉ. శ్యామల వార్షుకాంబుదనిభాంగ ! మనోహర ! నీదు సేతలున్
బ్రేమపు మాయమాటలను పిచ్చి ఘటించు ను మాకదేలొకో !
తామరసాక్ష ! ముగ్ధలము తత్త్వవివేచనలేని మేమునిఁ
బాముల బెట్టినన్ సయిపు - పాడొనరింపకుమాగృహమ్ములన్

5. చ. సరసిజనేత్ర ! మేమిపుడు చక్కఁ గఁ దీర్చి నమ్రుగ్గులన్నియున్
చెఱిపితివేని నీచిలిపి చేష్టలు చూచుచు నెమ్మనంబునఁ
మురియుదుమెట్టి కోపమును పొందము - ముచ్చటగొల్పునట్టి మా
యిరవులు చూడలే వె? కమలేక్షణ ! యింతలు కన్నులుండగఁ

6. చ. పరువము రాని చిన్ని యెలఁ బ్రాయపుఁ గన్నెలమేము - నీవు సా
గరుని మదంబణంచి యొడికంబున లంక జయించి రాక్షసే
శ్వరుని వధించి నట్టి బలశాలివి మా బొమరిండ్లనేలయీ
సరణి నికూల్పనెంచెదు ? యశంబిడఁ జాలు నె నీకు నిప్పనుల్

7. ఉ. అంబుదవర్ణ! నీనుడు లయంద లిమర్మము మాకెఱుంగశ
క్యంబొకొ ! ముద్దరాండ్రమముగా ఱియవెట్టిన లాభమున్నదే
యంబుధి కీవుఁ గట్టితి మహత్తర వారధి - బొమ్మరిండ్లు కూ
ల్పంబనియేమి ? నీ సతులపైనిదె యానసుమీ ! కలంచినఁ

8. చ. అనుపమ తేజముఁ గలుగు నట్టి సుదర్శన చక్రముఁ ధరిం
చిన వనరాశి వర్ణ ! చిఱుఁచేలయు వాలుకఁ బూని మేము చే
సిన బొమరిండ్లు కూల్చిమము చేడ్పడఁ జేసిన నీకుఁ గీర్తియు
బ్బునె ? తలపోయవే వెగటుబుట్టినఁ జేదగుఁ బంచదారయుఁ

9. చ. చెలులును నేనుఁ గూడికొని చేయు రహస్యపు గోష్ఠి దూరి నీ
వెలనగవుంబొనర్పఁ గమలేక్షణ ! మా బొమరిండ్లు మా మనం
బులు వికలంబులయ్యె నిఁక మూడు పదంబులముజ్జగంబులన్
గొలిచిన నీవు మమ్మిటుల కూడిన లోకులు నిందసేయరే ?

10. మ. జనకోర్వీశసుతాధరామృతము నాస్వాదించు కౌసల్యనం
దన ! మా యిండ్లను గూల్చకంచు వ్రజకాంతల్ పల్కు వాక్యంబులొ
య్యన గోదాముఖ పంకజాతగళితంబై యొప్పె నత్యంత పా
వన మౌద్రావిడభాష - కూర్పునిదియుఁ వైకుంఠసాన్నిధ్యముఁ

## మూడవ దశకము

1. ఉ. అంచిత భోగిభోగశయనా ! తొలి.కోడులు కూయుచున్నయే
తెంచి తిమిరందు తోఁగ - నదె తీక్ష్ణకరుండుదయించె - మమ్మువే
ధించకు - మీ సరస్సుకరుదేరమిఁకెన్నఁడు, చేతులెత్తి ప్రా
ర్థించెదమచ్యుతా ! కనికరించి యొసంగుముమాదువస్త్రముల్

2. ఉ. చిక్కని తేనెలూరుతులసీ దళమాలికఁ దాల్చు కృష్ణ ! నీ
వెక్కడి నుండి వచ్చితిట కేటికి వచ్చితి - మాదుచిత్తముల్
చిక్కెను నీకు -నైన నినుఁ జేరఁగ నేరము పెద్దలొప్పమిఁ
జిక్కని మా దు కూలములొసంగుము, కావుమ హేంద్రమర్దనా !

3. ఉ. అల్లరి మానుమింకఁ గమలానన ! యిప్పనిఁ జూచిరేని మా
తల్లులు కోపగింతురు పదంపడి వృక్షమునెక్కితేల ? మే
మెల్లర మీవు కోరినది యిచ్చెద మెవ్వరు చూడకుండఁ గా
వల్లవనాథ ! మాకిడుము వల్వలు - కావుము మాదుమానముఁ

4. చ. పొలతుకలీ తటాకమున మున్గదురంచును వచ్చినా - మెటుల్
వలువలులేకరాఁగలము బైటికి - మాకనులందునశ్రువుల్
గలయుస్రవింపఁజూచి దయకల్గదె ? కోతులతోడ నేస్తముఁ
గలిగిన నీదు పూర్వపు గుణంబది మారునె ? కోకలిమ్మికన్

5. చ. చుఱుంకుమనంగఁ గాల్కఱచుచున్ జిఱుఁమీనులు బాధపెట్టెమ
మ్మరయుచు వచ్చి మా పురుషులాయుధముల్గొని చుట్టుముట్టినన్
జరుగును పోరు - నీకు నది సమ్మతమే ? తరు శాఖమీఁద నీ
వుఱకటుకూరుచుండక పయోరుహలోచన ! యిమ్ము వస్త్రముల్

6. చ. పఱపుగనిత్తటాకమునఁ బ్రాకిన తామర తూడునెల్లమా
చరణములందు చుట్టుకొన - సారెకు తేళులు కుట్టినట్లుగా
నెరిసెను మేను - మృద్ఘటమునెత్తుక చక్కఁగ నాట్యమాడునో
పరమకళానిధీ ! పతిత పావన ! మా వసనంబులీయవే ?

7. చ. వనమున నిల్చి మేము కడు వందురుచుంటిమి సిగ్గులేనియి
ప్పనులను మాదు తల్లులును బందుగు లొప్పరు - పోదమన్న మా
మనికి యుదూర - మెవ్వరిటమామొఱవిందురు నీవు దక్క, మా
మనములు దోచికొంటివిఁక మాదగు పుట్టములిమ్ము మాధవా !

8. చ. అమరులు కొల్వఁగన్నుఁగవనల్లన మూసుక నిద్రపోవునో
కమలదళాక్ష ! యిందు పరకాంతలు, గన్యలు వచ్చినార - లీ
ప్రమదల బాధపెట్టుటది భావ్యమె ? గోపకిశోర ! పాదపా
గ్రము దిగివచ్చి కట్టుకొనఁగా వసనంబులనిమ్ము ! కేశవా !

9. మ. నినుఁగంసుండు నిశీథవేళఁ బిలువన్ - నీ ప్రాణముల్ దీయునో
యని దుఃఖించితిమయ్య ! బాష్పములు నీరైపాఱ - మమ్మిట్లుయా
తనలంబెట్టకు - నిన్నుదల్పుదు యశోదా దేవియిన్నాళ్ళుఁ - బూ
తనపాల్ ద్రావిన నీకు లజ్జయును లేదా ? యిమ్ము మాచీరలన్

10. మ. జలదశ్యాముని నందనందనుని భాస్వద్దివ్యచారిత్రమున్
విలసల్లీలలు - భట్టనాథుసుతగాఁ బేర్కొన్న గోదాంబని
ర్మల చిత్తంబున నుగ్గడించిన సుధామాధుర్యవాజ్మాలికా
వళులీ పద్యములన్ బఠింపఁ గలుగున్ వైకుంఠ సాయుజ్యమున్

## నాల్గవ దశకము

1. చ. అనఘులు నిత్యసూరులు మహాత్ములనేకులు ప్రస్తుతింపఁగా
మణిగణకాంతినొప్పు 'తిరుమాలిరుజోలె' విభుండు పెండ్లియై
ననుఁ దగఁ గూడి శేషశయనంబునఁ గూర్కొన వేళ సమ్మతిం
చునె? తన పాదమొత్తఁగను సున్నులకూడిక కూడి చెప్పవే !

2. చ. ఘనమగు వేంకటాద్రిఁ దిరుకణ్ణపురంబున వైష్ణవోత్తముల్
వినుతులు సేయ-నేకొఱయులేక కడుంగడు పేర్మినొప్పువా
మనుడఖిలాండ నాయకుఁడు మత్కర సంగ్రహణంబు తానొన
ర్చునె? మదిశంకవాయఁగను-సున్నలకూడిక కూడిచెప్పవే?

3. చ. వనరుహసంభవుండయిన బ్రహ్మయుమాన్యులు నిత్య సూరులున్
బ్రణుతియొనర్పఁగాఁదగు నభంగురతేజముగల్గుదేవకీ
తనయుఁడు పూరుషోత్తముఁడు దంచితశీలుఁడు మాధవుండువ
చ్చునె! ననుచెట్టవట్టఁగను - సున్నలకూడికకూడిచెప్పవే!

4. చ. ఘనతరుశాఖనెక్కి వ్రజకాంతలు బాలురు భీతిఁజెందఁగా
ననువుగఁగాళియోరగఫణావళి మీఁదఁబదంబు లాన్చుచున్
వనముల దూఁకి తచ్చిరముపైఁబ్రమదంబుగ నాట్యమాడు కృ
ష్ణుని జలగూడఁజాలుదునె - సున్నలకూడి కూడి చెప్పవే !

5. చ. మణిగణభూషణావళులు మానుగవెల్గులనీనుపట్టమా
ననవమునఁదాల్చి నట్టిమదనాగముఁగూల్చినశూరసత్తముం
డనఘుఁడునాకునైవెదకుచమ్మధురాపుర వీధినేగుదెం
చునె! ననుఁబ్రేమఁజేకొనునె! సున్నలకూడికకూడిచెప్పవే.

6. చ. దనుజులనుక్కడంచి బెడిదంబగుమద్దులగూల్చిగోపికాం
గనలను గోపబాలురనుగాఁచి-పరాక్రమమొప్పఁగంసమ
ర్దనమొనరించి తల్లితనురాజుగఁజేసినపుణ్యమూర్తివ
చ్చునె! ననుఁబెండ్లియాడఁగను - సున్నలకూడికకూడిచెప్పవే.

7. చ. మొనసి శతాపరాధములు మున్నొనరించిన మాగధేశునిన్
దునిమినమేటి మద్దులనుదుష్టబకాసురుఁబోతుటెద్దఁగూ
ల్చినబలశాలి, కంసునవలీలవధించిన పోటుకాఁడువ
చ్చునె ననునేలఁగానిటకు - సున్నలకూడికకూడిచెప్పవే!

8. చ. తనయెడభక్తికల్గి సతతంబును దన్ను భజించువారినె
మ్మనములలో వసించు పరమాత్ముఁడు, ద్వారకనేలువాఁడు, గో
గణములఁగూడియాడుమ జగమ్ముల బ్రోచుదయామయుండువ
చ్చునె, ననుఁబ్రేమలోఁగలయు - సున్నలకూడిక కూడిచెప్పవే?

9. చ. గొడుగుఁగమండలంబుగొని కొంచెపు వామనరూపమూని మూ
డడుగుల మేరయిమ్మనుచు నా బలిదైత్యుని దానమడ్గి, యొ
క్కడుగున భూమి వేరొకట నండమునంతయు గొల్చినట్టివి
ష్ణుఁడునను గూడు నేయిపుడు సున్నలకూడిక కూడి చెప్పవే ?

10. ఉ. ఏమహనీయునాగమములెల్లనుతించు బరాత్పరుండటం
చేమహితాత్ముఁడా మదకరీంద్రుని రక్షణ చేసె, నేపరం,
ధాముఁ డు గోపకాంతలమనంబున వర్తిలునట్టి సద్గుణ
స్తోముఁడు నన్నుఁ జేకొనునె : సున్నలకూడిక కూడి చెప్పవే !

11.ఉ. గోపవధూమణుల్ ప్రణయకోపముతో విరహార్తచిత్తలై
గోపకిశోరునిన్ దెగడి - కూడిరి పిమ్మట, నిట్టి గాధలన్
దాపక విష్ణుచిత్తసుత ద్రావిడ భాషరచించె ఁ జక్కఁగా
నీపదిపాశురంబులు రహిన్బఠియించినవీఁగుఁ బాపముల్

అయిదవ దశకము

1. మ : సారకేసర మాధవీద్రుమ - సంచరత్పికరాజమా !
సారసాక్షుఁడు నీలవర్ణుఁడు - శౌరినెంచుచునార్తిచే
నాజొదేహము, గాజులున్ వదు-లయ్యెఁజూడుమువేగనా
ధీరవర్యుఁడు మాధవుండరు దేరునట్లుగకూయుమా !

2. మ : పెల్లుగావిరితేనెలానుచు ఁ బేర్మి ఁగూసెడు కోయిలా !
తెల్ల శంఖముదాల్చునాహరి దివ్యరూపముఁజూపి నా
యుల్లమున్ హరియించి నెవ్వగ నొందఁజేసెను. నీవిఁకన్
వెళ్లి వేంకటశైలనాధుని వేగరమ్మని పల్కుమా !

3. మ. పూలతోటల సంచరించుచు ఁబువ్వు ఁదేనియలానుచున్
సోలి పాడెడు భృంగగీతికిఁజొక్కుచుండుపికోత్తమా !
ఆలమందున నింద్ర సారధి స్యందనంబును దోలఁగా
బాలిశున్ దశకంఠుఁదున్మిన వానిరమ్మని పిల్వుమా !

4. మ. కన్నుదోయికి ఁగూర్కు కల్గదు - క్రాగెనెమ్ములు-బాధతో
నున్నదాన, నగాధమైన - వియోగ వారిధి మున్గితిన్
దెన్నుతోపదు చక్రపాణియె - తెప్పకావలెనాకు - నా
పన్నగాశనవాహనున్ మురవైరి రమ్మని కూయుమా.

5.మ. అల్లనల్లన సంచరించెడు హంసరాజములున్న శ్రీ
"విల్లిపుత్తూరు" దేవునింగను - వేడ్కకన్నులు గావె - నా
పల్లవయ్యను నాకుఁ జూపుము - శర్కరాన్నము పెట్టెదన్
పల్లశారికనెత్తుఁ బోదుగ నీకుఁ గోకిల సత్తమా !

6.తరళ. విరిమొగ్గఁబూసిన పూలతోటల విశ్రమించుచున ప్రియా !
సురనుతుండగు నమ్మకుందునిఁ జూడకుంట మదోష్ణమం
బెడంగు తగ్గను. సహ్యరాదొక - యింత - నా ప్రియుఁ జేర్పుమా
కరము పంచి నమస్కరించెదఁ జేయఁ జాలనిఁ కేమియున్

7. త. వనధిశాయిని కౌఁగిలించెడు వాంఛచే మదురోజముల్
ఘనములై యుబుకెక్కి బాధను కల్గఁ జేయుచునుండె - నా
కనులు గప్పి చరింతువేల ? పికంబ ! శంఖముఁ జక్రమున్
మొనసి పట్టిన వానిఁ జెంతకుఁ బుచ్చి సాయము సేయవే ?

8.చ. అలముక తీయమావి చిగురాకులు మేసెడు మత్తకోకిలా !
చెలువము మీరఁ జూపనను వంచగఁ జాలిన దోర్బలుండు - నా
పలుకు నెఱుంగనే నతని భావమెఱుంగుదు - నా శ్రియఃపతిన్
పిలుపుము వేగ రమ్మనుచుఁ బిమ్మట మాడుముఁ కేమి సేతునో

9.చ. అలికుల ఝంకృతుల్ వినుచు హాయిగఁ దిర్గుచునుండు కోకిలా !
విలుకలనంటి చెయ్యిగల శ్రీధరుఁడన్ వలఁ జిక్కికొంటి - నా
పలసిత శంఖచక్రధరు నెంటనె తోడ్కొనిరమ్ము - లేక త
ద్వలయముఁ దెచ్చియిమ్ము ప్రమదంబుగ - నీవు వసింపఁ గోరినన్

10 చ. అల త్రిజగమ్ములేలిన మహాత్ముని గోష్ఠియు క్లేశమొందితిన్
మలయసమీరణుండును సుధాకరుఁడు నాతనికిన్ సహాయులై
కలఁతలు పెట్టి - రిప్పనుగాఁ జేయ పెట్టకు - నమ్మకుందునిన్
పిలువక యున్న నిన్ను వన వీధులనుండియు - పాఱఁ ద్రోలెదన్

11. సీ. చతురాననునివోలెఁ జతురాగమములందు
చతురుండౌ వైష్ణవ స్వాములందు
విల్లిపుత్తూరులో విష్ణుచిత్తాఖ్యుని
తనుజాత యైన గోదాకుమారి

నేలయునింగియు నిజ పాదయుగళిఁగొ
ల్చిన త్రివిక్రముని సంశ్లేషమందఁ
దలపోసి యాతండు తన వద్దకేతెంచి
దృగ్గోచరంబగు రీతి దోఁప
గీ. నింపుగాఁ గూయుమంచు గోఁయిలను గూర్చి
పలికినట్టి పాశురము లిప్పుదియునేర్చి
నరవరుల్ 'నమోనారాయణా' యటంచుఁ
బాయ కుందురు . వైకుంఠ పదమునందు -

**ఆరవ దశకము :**

1. గీ. వేయియేన్గులతోడనారాయణుండు
నేగుదేరఁజూచి జనంబులెదుటఁ బూర్ణ
కుంభములనుంచి, తోరణస్తంభములను
నాటుచున్నట్లు కలగంటి బోఁటి నేను
2. గీ. ఎల్లి సుముహూర్తమని పెద్దలెల్లఁ బెండ్లి
పందిరులు వేసి పోకకంబముల మర్చి
బాలసింహముఁబోలు గోపాలుఁడందు
చొచ్చినట్టుల కలఁగంటి సుదతినేను
3. గీ. వాసవాది దేవతలెల్ల వచ్చి నన్నుఁ
బెండ్లి కూతురు జేయఁగా విష్ణుభగిని
చేలముంగట్టి కల్యాణమాలనాదు
కంఠమునవేసినట్లు నేఁగలనుగంటి
4. గీ. బ్రాహ్మణోత్తముల్ వివిధ తీర్థములు తెచ్చి
శిరముపైఁ జల్లి నన్ను నాశీర్వదింపఁ
బంకజాక్షుఁడు నాచేతఁ గంకణంబు
కట్టుచున్నట్లు కలఁగంటి గలికి నేను
5. గీ. వెలుగు లీనెడు పలు దీపకలశములను
నెత్తుకొనుచుఁబుణ్యాంగనలెదురు కొనఁగ
బాదుకలు వీడి కల్యాణవేది కడకు
హరియరిగినట్లు కల గంటి నతివ ! నేను

6. గీ. శంఖములు మద్దెలల్ నల్లి - శలను మ్రోయ
నాణిముత్యాల సరులు వ్రేలాడచుండ
మండపమునందు నా చేయి మధురిపుండు
పట్టి కొనినట్లు చెలిరో ! స్వప్నంబు గంటి.

7. గీ. : వేదమంత్రముల్ చదువుచు ద్విజులు దర్భ
లగ్ని చుట్టిడి వేల్వఁగా - నచ్యుతుండు
నాకరంబు పట్టి ప్రదక్షిణంబు చేయు
చున్న యట్టులు కలఁగంటి నుత్పలాక్షి !

8. గీ. సకియ ! యీజన్మకేడేడు జన్మములకు
మనకు బలియైన కృష్ణుండు తనదు హస్త
పంకజమ్మున నాకాలు పట్టి నన్ను
కల్లఁ ద్రొక్కించినట్లునే గలను గంటి.

9. గీ. అతివ ! నా సోదరుల్ వచ్చి యగ్ని కెఱఁగి
నన్ను ముంగల నిలఁబెట్టి -నంద సుతుని
కేల నాదు కేలుంచి - పేలాలనెత్తి
వహ్ని కల్పించినట్లు స్వప్నంబుగంటి

10. గీ. ఉరుసుగంధము కుంకుమ మొదలనలఁది
మంచి పన్నీరు చల్లిన మార్గములను
నేన్గు పై గృష్ణుఁడేను నూరేగి పిదప
జలకమాడిన యట్లు నేఁగలనుగంటి -

11. చ. అనఘగుణుండు వైష్ణవుల కాదర పాత్రుఁడు నైన భట్టు నా
ధుని ప్రియపుత్రి మాధవునితోడ సమాగమమొంద ఁ గోరి కాం
చిన కలఁ గూర్చి నెచ్చెలికి ఁ జెప్పిన యిప్పది పద్దియంబులన్
వినినఁ బఠించినఁ బ్రజలు పెంపు వహింతురుపు త్రవంతులై

ఏడవ దశకము :

1. ఉ. చిక్కని మాధవాధర విశిష్టసుధారసమో సుగంధమో
పిక్కలి గ్రోలు శంఖమ ! తమింగొని నిన్నొకమాట యడ్గెదన్
నిక్కము ఁ జెప్పు దాని రుచి నీరజముంబలె తావులూరునో !
చక్కెరవోలెనుండునో ? పసందగు కప్పురమట్టులొప్పునో !

2. చ. శరనిధిఁ బుట్టితీవు నిను సోకెను పంచజనాభిధానుఁడౌ
సురరిపుఁ డీ యదార్థమును సుంతతలంపక నీవు - దైత్యసం
హరుఁడగు వాసుదేవునికరాబ్జము జేరి నిశాటహృత్పుటో
త్కర మగలంగ నుగ్రముగ గర్జన చేసెదవేల ? శంఖమా !
3. ఉ. పున్నమనాఁడు చందిరుఁడు పూర్వగిరీంద్రము పై శరత్తునన్
జెన్నలరారి వెన్నెలల శేషముగా వెదజల్లుకైవడిన్
బన్నుగ వాసుదేవకరపంకరుహంబున నుండి నల్దెసల్
కన్నుల పండువై యలరుకాంతులఁ జిమ్మెద నీవుఁ జిందమా !
4. గీ. అచ్యుతునికేల శశిబింబమట్లు వెలసి
యతనిచెవిలోన మంతనాలాడుచుండు
పాంచజన్యమ ! నీ మహద్వైభవంబు
వడయఁ జాలడు దేవతా వల్లభుఁడును.
5. గీ. జలధి నెన్నియో నీతోడఁ బొడమెఁ గాని
వాని నెవ్వరు తలఁపరీ వసుధలోనఁ
దామరస నేత్రునధరామృతంబు గ్రోలు
పదవి లభియించె నీకు నీ భాగ్యమేమొ ?
6. ఉ. పూనిక మీఱ దవ్వులకుఁ బోయి పవిత్ర నదీజలంబులన్
దానము సేయకుండ సతతంబు ముకుందునికేల నిల్చియిం
పైన తదీయ దివ్యమధురాధర పానమొనర్చి దానిలో
స్నానమొనర్చు చుండెదవు శంఖమ ! నీదు యదృష్టమెట్టిదో !
7. గీ. అపుడ విచ్చిన కెందామరందు పొదను
మంచితేనియలానురాయంచ పగిది,
నరుణనేత్రంబుగజీమేను నలరునట్టి
కృష్ణుకెంగేలఁ గుల్కెద నీవు నవుర !
8. గీ. తామరస నేత్రునధరామృతమ్ముఁ గాని
యుదధి వర్ణుని కరమందు నిదురవోవు
నిన్నుఁ గని కేలు సాచుచు నెలఁత లెల్ల
వెడలు చున్నారు పోరుకాపించునట్లు.

9. గీ. కృష్ణప్రియ భామినులు పదార్వేలమంది
యతని యధరామృతము గ్రోలనాసపడఁగ
దాని నీవు భుజింపఁగా దలఁతువేని !
జిందమా! వారు జగడంబు సేయరొక్కొ !
10.ఆ. పాంచజన్యమునకు ! బద్మనాభునితోడఁ
జుట్టఱికము కలిపి - సుదతి గోద
పలికె ద్రావిడమునఁ బది పద్యములు నీని
జదువు వారు విష్ణుపదముఁ గాంత్రు -

**ఎనిమిదవ దశకము :**

1. ఉ. నీలపుఁ గప్పు వేసినటు నింగిఁ జరించు ఘనమ్ములార ! ని
ర్వేలకృపాపయోధియగు వేంకటనాయకుఁడేగు దెంచెనే !
కాలువలై స్రవింపఁజనుగట్టుల నుండి యుమశ్రుబిందువుల్
రాలఁగ నేడ్పునన్ను విడరాదని యాతనితోడఁ జెప్పుమా !
2. చ. పసిఁడియు ముత్తెముల్ గురియు వార్షిక మేఘములార ! యెక్కడే
బిసరుహపత్రలోచనుఁడు వేంకటనాథుఁడు కానిపించెనే !
యసమ శరాగ్ని మేనెరిసె - నా పయినమ్మలయానిలుండునన్
నిసులఁదఁపింపఁ జేసెఁ గరుణించి శ్రియఃపతిజాడఁదెల్పుమా !
3. చ. వనదములార ! నా ప్రియుని బాయుటచేఁ గృశియించె మేను, కం
కణములు తద్దయున్ సడలెఁ గాంతియుఁ దగ్గెను నిద్రయున్ సెడెన్
మనము గలంగె - నేనిఁకఘనంబగు వేంకటశైలమందుని
ల్చిన విభు సద్గుణంబులు భజింపఁగఁ బ్రాణము నిల్పనేర్తునే !
4.చ. ఒడలఁ దటి త్ప్రభల్ వెలయనొప్పు సితాభ్రములార ! యౌవనం
బడరెడు మత్కుచద్వయసుఖానుభవంబును గోరి వారిజా
క్షుఁడు తన బాహుబంధమునఁ గ్రుచ్చి నను న్ మురిపించునొక్కొ ! యే
ర్పడనలవేంకటాచలనివాసునకున్ వినిపింపునామొఱన్
5.చ. చెలువుగ వేంకటాద్రి వికసించిన పుష్పమరంద సారము
ర్మిలిఁగొని వర్షమున్గురియు మేఘములార ! సుతీక్ష్ణమౌనఖం
బులనసురున్ హిరణ్యకశిపున్దునుమాడిన విష్ణుతోడ నా
యలమటఁ దెల్పి - వేతి వలయంబులనిమ్మని విన్నవింపుడీ !

6. చ. జలధిజలమ్ముఁ బీల్చికొని చల్లగ సాగెడు వారి వాహముల్ !
బలిని జయించినట్టి భగవాఁనుడు వేంకటశైలమందు తా
వెలసెను - మీరలచ్చటికివెళ్లి వచింపుఁడతండు నామదిన్
దొలిచి ఘటించె శూన్యతను దోమలు తిన్న వెలంగపండ్లటుల్

7.చ. శరధి మథింపఁ దోడ్పడిన స్వామి వసించెడువేంకటాద్రి పైఁ
దిరిగెడు మేఘపుంజమ ! మదీయకు చాగ్రవిలిప్త కుంకుమ
స్ఫురదురుపంకముల్ చెఱఁగి పోవఁగనాతఁడు నన్నుఁగౌగిలిన్
ద్వరితమచేర్చకున్ననిఁక ప్రాణముఁ దాల్పనటంచుఁ జెప్పుమా !

8.చ. ఎడపక వేంకటాద్రిఁ జరియించెడు వార్షక వారి వాహమా !
జడధినిదాటి రావణునిఁ జంపిన యారఘురాము సంతతం
బెడఁదలపోసిపోసి కృశియించితి ఁబండిన జిల్లెడాకుకై
వడి - నిఁకరాలి పోదున నివాకొనుమా ! దయచేసి వానితోఁ

9. చ : తిరుమల మీఁద నెప్పుడు మదించిన యేన్గుల భంగిఁదిర్గునో
శరదగణమ్ములార ! ఫణిశాయి శ్రితావనుఁడన్నమాటబద
బ్బుఱయగునొక్కొ ! యాతఁడొక బాలను మోసము చేసి, నిర్దయా
పరుఁడయి సంహరించెనను వార్తను లోకము వారు మెత్తురే ?

10. చ. అనయము వాసుదేవుని గుణానుభవంబును పొందు విష్ణుచి
త్తుని ప్రియపుత్రి - భక్తవరదుండగు వేంకటనాథుఁజేర ఁగా
ఘనముల దౌత్యముఁ నెరపి కౌతుకమారఁగ విన్నపంబుచే
సిన పది పద్యముల్ వినిన శ్రీపతిసేవ లభించు వారికిన్.

**తొమ్మిదవ దశకము :**

1 చ. పఱపుగ నెఱ్ఱసిందురము పర్చిన కైవడినింద్రగోపముల్
విరిసెవనాద్రి - నాఁడుకడలిఁ మథియించి సుధారసంబునా
సురలకొసంగినట్టి మధుసూదను సుందర బాహువల్లరిఁ
నిరతము చిక్కుకున్న మన నేర్తునె నేక్షణ కాలమేనియుఁ

2 చ. ఆలము సేయఁగాఁ దివురుహస్తి చయంబు చరించు 'మాలిరుం
జోల'ను పూచుమల్లియలు సొంపుగ మాధవుమందహాసముం
బోలెఁ దనర్చె - వన్యసుమముల్నను ఁజూచి హసించుచుండె - నేఁ
దాళఁగ జాల - నాదగువ్య థాభరమేమని చెప్పుదుఁజెలీ !

3. చ. పొలుపు రహించు నోయవి సెపూవులు గాటుక పూవులార ! యా
జలనిధి కన్యకా ప్రియుని చక్కని రూపము నాకు జూపు డా
పొలఁతికి భోగ్యమైన భుజముల్ గల సుందరబాహుమూర్తినా
వలయముల న్ హరించె నిది భావ్యము కాదని మీరు తెల్పుడీ !

4. మ. అతసీకాకణపుష్పపుంజమ ! మయూరానీకమా ! కోకిల
ప్రతతుల్ ! దుర్భర పంచపాతకములారా ! ''మాలిరుంజోలలో''
నతిరమ్యంబుగ నున్న మాధవుని దివ్య శ్యామవర్ణంబుఁదా
ల్చితిరీరు న్ - మఱి దానఁ బెంపుగలదే ? చింతింపమీకెంతయు న్

5. మ. లలితోద్యానములందు కృష్ణుని తనూలావణ్యముంబోలు ని
ర్మల పుష్పంబులలో వసించు నళులారా ! సారకాసారమా !
దళదంభోజములార ! మిమ్ముఁగన మాత్సర్యంబు సంతాపము న్
గలిగె న్ నాకును జూపుఁడీ ! శరణమొక్కండార్తి చల్లారఁగన్

6. గీ. సొబగు మీఱెడు ''మాలిరుంజోలి'' లోనఁ
దనరు స్వామికి నూఱుపాత్రముల నిండ
వెన్నయును శర్కరాన్న మర్పించికొంటి
వీనినతఁడు గైకొన్న - నర్పింతు మఱియు

7. ఉ. సారసుగంధబంధురలసన్మలయానిల సంచయంబులో
ప్పారువనాద్రిలోఁగల శ్రియఃపతి నేనిడు భోగమాని న్
సారెకు లక్ష పాత్రల ప్రసాదము నర్పణ చేసి వెండియు న్
గోరికతీరనెల్లపుడు గూర్తునితోధికమైన సేవల న్

8. గీ. : అవె భరద్వాజ విహగంబు - లు దయమంద
మేలుకొని యుండి 'మాలిరుంజోలె ' నున్న
వనధి శాయికి ద్వారకా వల్లభునకుఁ
బాడుచున్నవి స్వాగత వచనములను

9. ఉ. ఆవిపినాద్రి బూచిన లతాంత వితానముతోడ గన్నెరుం
బూవులు పూచెఁగాని, హరిపూజకు నోచక రాలిపోయె - న
ట్లే వృధయయ్యె నాబ్రదుకిఁ కెన్నడు తత్కమనీయ శంఖసం
రావము దివ్యశార్ఙ్గగుణరావము నా మదికింపు గూర్చునో ?

10. ఉ. కమ్మని చందనాగురుల కాష్ఠముఁ దెచ్చి జలాశయంబులన్
బమ్మినరీతిగాఁగలిపిపాఱెడు నూపురగంగ చెంతది
వ్యమ్మగు కాంతితోడ నలరారెడు సుందరబాహుఁ గూర్చి గో
దమ్మ రచించె నీదశక - మచ్యుతు సన్నిధిఁ జేర్చు నందఱన్

**పదవ దశకము**

1.ఉ. నీలపు రంగు గల్గినవనీ ప్రసవౌఘములార! వార్నిధిన్
బోలిన మాధవుండు మిముఁబోరికి మాపయిఁ బంపి యాతఁడే
మాళిగలోన డాగె ! నిఁకమామొఱ లెవ్వరు విందు రాకృపా
శీలుఁడు దాల్చినట్టి తులసీ దళమాలిక మాకునీయరే !

2. చ. పొలుపు రహింపఁబైకెగసి పూచిన పుష్పములార ! ముజ్జగం
బులనునతిక్రమించిన విభుండు మురారికరాంబు జంబునన్
మిలమిల మండు చక్రమటు మీరును మమ్ము దహింపఁ బోకుఁడా
నళిన దళాక్షు సేవకునన్వర్థముగా నమనెంచఁబోకుఁడీ !

3. చ. మురహరునోష్ఠబింబమును పోలినబింబమ ! నాకు నీఫలో
త్కరమును చూపి మాటికి వ్యధన్ గలిగింపకు మింక - నీకునే
వెఱవను గాని - నేను ప్రభవించిన పిమ్మట శేషశాయియున్
ద్విరసనుఁడయ్యెఁబాముపలె - నేనొనరించిన పాపమెట్టిదో !

4. చ. సురుచిరమైన నీ తెలుపుఁజూపి ముకుందు ని మందహాసమున్
గుఱుతుకు తెచ్చి నాకు వ్యధ ఁగూర్పకు కుందమ ! దుష్టబుద్ధియై
పరఁగిన దానవాంగనను భంగమొనర్చిన రాము మాటద
బ్బుఱయగు నేని - నాదు ప్రభవంబును ధాత్రిన సత్యమేయగున్

5.ఉ. కోయిలలార ! యేలయిటుగోల యొనర్తురు భీకరంబుగా -
శ్రీయుతుఁడైన వేంకటగిరీంద్రుఁడు మాయెడ ఁగూర్మిఁజూపినన్
గూయుడు - మమ్మతండు జతఁగూడిన యప్పుడు మేమ మిమ్మునా
ప్యాయము మీఱఁ బిల్చి ముదమారఁగ విందుము మీదుగానమున్

6.చ. జలధరమూర్తి కృష్ణువలెఁ జక్కని గాత్రము గల్గి నాట్యమున్
సలిపెడు నెమ్మిలార ! యిదె సాగిలి మీకు నమస్కరింతు - నా
చిలువలఱేని పై ఁగునుకు శ్రీహరి యీగతి నన్ను మీ పదం
బులఁబడులాగు చేసెఁ - దల పోయుడు మీరు నిదేమి న్యాయమో ?

7. చ. నెఱిఁబురి విప్పి చిత్రముగ నృత్యము చేసెడు బర్హులార ! మీ
సురుచిర నాట్య కౌశలముఁజూచెడు భాగ్యములేక పోయె - సుం
దరముగ (గుంభ నృత్యము నొనర్చెడు గోపకిశోర మూర్తి క్ర
చ్చుఱ హరియించె నాదు హృదయంబును నాసకలేంద్రియంబులున్
8. చ. కలయఁ గమన్ను పైనలఁది కంచరి పాత్రలలోని ద్రావముల్
వెలికిని దెచ్చుచందమున - వేంకట నాథుఁడు నాదు చిత్తమం
దలరిన సారభూతమగు నాత్మపదార్థము పైకిఁ దీసి, నల్
గలసిన వేళ వర్షముఁ దగల్ గురిపింపుడు వారి వాహముల్
9. శా. పారావారమ ! నీ యొడిన్ నిలిచి నీ వాఃపూరముల్ ద్రచ్చియే
పారల్ నీ సుధయున్ సిరిన్ గొనియెఁ బద్మాక్షుం - డటుల్ నామదిన్
శ్రీరంగేశ విభుండు చేరి హరియించెన్ నాదు సర్వస్వమున్
గారుణ్యంబున నాది శేషు నకు నాకష్టంబులన్ దెల్పుమా !
10. చ. చెలియరో ! దేవ దేవుఁడును శేషశయానుఁడు నైన విష్ణుకో
మలపదసన్నిధానమును మానవమాత్రులు చేర నేర్తురే ?
యలఘుగుణాఢ్యుఁడచ్యుత పదాంకితచిత్తుఁడు విష్ణు చిత్తుని
శ్చల మతినాశ్రయించిన - భృశంబగు మార్గము జూపునాతఁడే !

**పదకొండవ దశకము :**

1. చ. : తరుణిరో ! యారమాధవుఁడు తాల్చిన శంఖము వంటి గాజులే
కరమునఁ దాల్చితేను - మమకారము నాతఁడు చూపడేలొకో !
గరళముగ్రక్కునట్టి భుజగంబుశయానముగాఁగ - ఘోరసా
గరమునఁ బవ్వళించు మురఘాతికి నక్కటికంబు కల్గునే ?
2. ఉ. సుందరులార ! నా విభుఁడు సుందరుఁ డాతని నాభిపద్మమున్
సుందర, మాస్యబింబమును సుందర, మోష్ఠము గేశపాశమున్
సుందర, మక్షియుగ్మమును సుందర, మాతనితో సమైక్యమున్
జెందఁగలేక నా యొడలు చిక్కెను - జాఱెను కంకణంబులున్
3. చ. చలదురు వీచికా సహితసాగర సంవృతమైన సర్వభూ
వలయము నూర్ధ్వలోకమును పాలన సేయుచు నెట్టి లోపమున్
గలుగకయుండు రంగపతి - నాకర కంకణముల్ హరించినన్
దొలఁగునె వానికిన్ గొఱంత - దూఱుఘటిల్లును గాకయిమ్మహిన్

4. ఉ. నింగిని దాఁకువ ప్రములనేక విశాలగృహంబులున్న శ్రీ
రంగమునందునిల్చిన 'సిరంగడు' వామనుఁడౌచుఁ డొల్లి భి
క్షంగొనినట్టి భూతలము సొలక నావలయంబులందు నా
సంగొనునేని - నాతని కొసంగనె నేన - ప్రమోద మారఁగన్

5. చ. అరయఁగ దాను విశ్వపతియయ్యును నా బలిచేతి దానమున్
గరమున (బట్టి కై కొని జగత్త్రితయంబును గొల్చినప్పుడే
పరవశమొంది సర్వమును వానికి నర్పణ చేసికొంటి - నా
కరవలయంబులందు కొనఁగాన తఁడిప్పుడు రాక యుండునే ?

6. శా. శ్రీరంగేశుఁడు మున్నెతత్సుగుణ సౌశీల్యాదులంజూపి యిం
పారన్నా కరభూషలన్ గొనియె - సస్యక్షేత్రముల్నిండ (గా
వేరీ నీరముపాఱునట్టు - లచటన్ వెల్గొందు నా స్వామిలో
కారాధ్యుండు పరిగ్రహించెను మదీయాత్మన్ మదాత్మీయమున్

7. మ. పలువప్రంబులు గోపురంబులు మహాప్రాకార వర్గంబు భా
సిలు శ్రీరంగ పురంబునన్ వెలయు లక్ష్మీనాథుఁడా నాఁడు వి
హ్వలుఁడై నిద్రయుఁదిండి మానికడలిన్ బంధించి భూపుత్రిను
గ్మలిఁ దోడ్తెచ్చెను - నేఁడదేమికతమో ? కాన్పింపఁడాప్రేమమున్

8. చ. ప్రళయ పయోధిమున్గి మును పంకము బట్టిన ధారుణీ సతిన్
నళినదళాక్షిఁగావ - మలినంబగు క్రోడము రూపు (దాల్చిని
స్తుల మహిమాభిరాముఁడయి శోభిలు చుండెడు రంగశాయి తాఁ
బలికిన సూక్తులెప్పుడెడఁ బాయక నిల్చెను నామనంబునన్

9. చ. నిరుపమసుందరాంగి నళినీ దళనేత్ర విదర్భకన్యకన్
బరిణయమాడ నెంచు శిశుపాలుమదాంధునిఁ జంపి రుక్మిణిన్
బరిణయమై - రమాప్రియుఁడు నాఁబొగడొందిన రంగనాథుఁడే
పురమునునుండు నాపురి సమున్నత లక్ష్మికి నాటపట్టగున్

10. మ. మునురంగే శుఁడు కృష్ణుఁడై నరుని సంబోధించి గీతన్ వచిం
చిన సూక్తుల్ విని విష్ణుచిత్తుఁడు ''నన్నున్ సేవించు భక్తాలిర
క్షణమున్ నేన యొనర్తు ''నన్న హరి వాగ్దానంబు బొంకైననా
తని శాసించెడు వారలెవ్వరనుచున్ దానుండు నిశ్చింతుడై .

సిరంగడు = శ్రీరంగనాథుడు

## పంద్రెండవ దశకము

1. చ. పొలతుకలార ! నాకుయదు భూషణుంపైఁ గల ప్రేమమేగతిన్
దెలుపుదు. మూగతోఁ జెవిటి తెల్పినయట్లగు - నొక్క తల్లికిన్
గలిగి మఱొక్క తల్లికిని గాదిలి పుత్రకుఁడైన యట్టి నా
చెలువుఁడు కృష్ణుఁడున్నెడకుఁ జేర్పుడునన్ను దయాంతరంగులై

2. చ. ఎడఁదను భీతియెందుకిఁక నెల్లరెఱింగిరి నాపరిస్థితిన్
దడయక మంచి మందొసఁగి నారుజ మాన్పఁదలంతురేని మూ
డడుగులతోడ నీజగములన్నియు గొల్చిన వాని చెంతకి
ప్పుడనను(బంపు - డప్పరమ పూరుషుఁ జేరిన మానునా వ్యథల్

3. మ. తలిదండ్రుల్ మఱి పెద్దలున్ గలుగ నీతన్వంగి స్వేచ్ఛాగతిన్
మెలఁగెన్ దాననునింద (బాపఁ దరమే ? మేఘ స్వరూపుండతం
డెలమిన్ నామ దిదోఁచెనట్టి సుగుణాన్వితున్ సుతున్ గన్నని
స్తుల పుణ్యాత్ముఁడు నందు వాకిటనిశన్ దోడ్తోనన్ వీడుడీ !

4. చ. అనయము చక్రహస్తుని ముఖాబ్జముగా కితరంబులేవియున్ -
గనుఁగొనమంచుఱైకలను గప్పుకలోననడంగియున్న మా
స్తనములు చూడు మివ్వియదు చంద్రుని తప్ప వరింప నన్యులన్
నను - యమునాతటిన్ దిరుఁగు నందకుమారుని చెంతఁ జేర్పుమా !

5. చ. నెలఁతుకలార ! మీరెఱుఁగ నేరరు నాగదమేమొ ! మాధవుం
డెలమిని నాదు మేను స్పృశియించిన నయ్యది తగ్గు వెంటనే !
వలగొని కాళియాహి తలపైఁ బదముంచియతండు నాట్యమున్
సలిపిన యా సరోవరము చాయకు నన్గొని పొండు చెచ్చెఱన్.

6. చ. అతసి యువన్యనీలములు నంబురుహంబులు తోయదంబుల
చ్యుతుకడకేగుమంచునను నూరక త్రోచె - క్షుదార్తి తీఱఁగా
నతఁడుమునీంద్ర పత్నులిడినట్టి ప్రసాదము నాని వారియా
ప్సితమును దీర్చె - నన్నచటఁ జేర్పుడు భక్తవిలోచన స్థలిన్

7. మ. తనువై వర్ణ్యము బుద్ధి మాంద్యము మనస్తాపంబుఁ గోపంబు భో
జన వైముఖ్యము గద్గదత్వమును, చాంచల్యంబు - కృష్ణుండు తా
ల్చిన శ్రీమత్తులసీదళ స్రజముమౌళిన్ దాల్పమాయంబగున్
నను రాముండు ప్రలంబుఁ గూల్చినెడకున్ 'ఖాండీరమున్' జేర్పుమా !

8. చ. అడవిఁ జరించె, గొల్లఁడయి యావుల మేపెను, ఱోటఁగట్టఁగాఁ
బడియెను చోరుఁడయ్యెనను భావముఁగల్గకుఁడమ్మ ! యమ్మహా
త్ముఁడు వ్రజ బృందముల్ మనుప భూధ్రము ఛత్రముగా ధరించి తా
నడఁచె సురేంద్రుకావరము - నన్నటకుంగొని పొండు పిఱికన్

9. మ. కుతుకంబారఁగ గూళ్లనుండి చిలుకల్ గోవింద గోవిందయన్
నుతులన్ జేయును, భోజనంబిడకనే గోపింపహా కృష్ణ ! య
చ్యుత ! యంచాడును మీరు నిందపడనేలో యమ్మ ! యాకాశ చుం
బిత సౌధావలి యొప్పు ద్వారక నునన్ వీడుండు - వీరొయ్యనన్

10. మ. రమణీ యోన్నత భర్మహర్మ్యపితతుల్ రాజిల్లు పుత్తూరులో
విమల స్వాంతుఁడు భట్టనాధుసుతయై పెంపారు గోదాంబ, త
న్నుముకుందాంతిక మందు చేర్పుమని బంధుశ్రేణి నర్థించు వా
క్సుమముల్ వీనిఁ బఠించు వారికి లభించున్ విష్ణుసాక్షాత్కృతుల్

## పదమూడవ దశకము

1. చ. తలపఁగఁగృష్ణుఁడొండె పరదైవము నాకును, వాని కోసమై
యలమటఁజెందు నా యెదుట నాతని దూఱకుఁడమ్మ ! పుండుపై
బులుపును వోసినట్లు మనముల్ గడునొచ్చు - నతండు దాల్చుపై
వలువను దెచ్చి నా విరహ బాధశమింపఁగ వీచుడీ ! సఖుల్ !

2. చ. అలవట పత్రశాయివశమైనది నామది-లేనిపోని మా
టలనన ఁ బోకుఁడింక వికటంబుగ - నల్లదెగోపబాలుఁడై
నిలిచి "కుడంద" యందు ఘట నృత్యము చేసిన వాసుదేవు కో
మలగళసీమనొప్పు వనమాలను నా సిగలోనఁ బెట్టుడీ !

3. చ. అమితమదాంధు గంసు దెగటార్చిన దిట్టఁడు విల్లువంటిక
న్బొమలను కల్గినా మనసునొంచెఁ ద దీక్షణ మార్గణంబులన్;
శ్రమపడుచున్న దానని జాలియు జూపడు వాని వక్షమం
దమరిన పుష్పమాలఁగొని యల్లనఁ జుట్టుడు నాయురస్థలిన్

4. చ. బలిమిని గిత్తవోలె వ్రజ భామలఁ బట్టి రమించు వానిచే
నలుగుడు వడ్డనన్ను భువనంబున నెవ్వఁడు కావనేర్చు - నా
యలమట దీఱఁగా నమృతమట్లు తదీయముఖారవింద ని
ర్గళిత మరంద సారమును త్రావఁగ నిమ్మొక బిందువేనియున్

కుడంద = కుంభఘోణము

5. చ. ప్రతి దినమెంత భక్తిని ప్రపత్తిని చూపిన గాన రాఁడు, నా
వెతలు తొలంగఁగా దనదు వెచ్చని కౌఁగిట ఁ జేరనీఁడు, గో
ప్రతతులవెంబడిన్ జనుచు ఁ బాడు రమాధవువేణు రంధ్ర ని
ర్గత మధురాధరామృతము గైకొని నాముఖమందు చల్లుడీ !

6. ఉ. నీతి ఁ దొఱఁగునీ యీ జగతి నిర్భయుఁడై యొక ధూర్తనంద సం
జాతుఁడు బాధపెట్టెనను స్వార్థపరుండయి మేనః నొవ్వఁగా;
నాతని దివ్యమంగళ పదాంబుజయుగ్మము సోకినట్టి ధా
త్రీతల ధూళిసుంత కొని తెచ్చి మదంగములందు పూయుడీ !

7. ఉ. తామర సాక్షునాజ్ఞ జవదాటన శక్యము కానని భువిన్
వేమును పెంచినట్లతనిఁ బెంచె యశోదయు - నైననామునం
బా మురళీధరున్ వలచె - నాదట తీఱఁగ నా స్తనంబు త
త్కోమల బాహుయుగ్మకముతో (గలియన్ బిగియార (గట్టుడీ !

8. చ. సతతము తన్ను (గూరిచి విచారము సేయు పొలంతి చచ్చెనో
బ్రతికెనొయంచు ఁ జూడక పరాఙ్ముఖుఁడై నను హింస పెట్టునా
కితవునిఁగాంతు నేని (బరికింపక వ్యర్థములైన యీస్తన
ద్వితియము దీసి నే విసరి వేసెద వాని యురస్థలంబునన్

9. చ. ఎదిగిన యీ యు రోజములు కృష్ణునకున్ గొఱగాక యుండినన్
బ్రదికి యు లాభమేమి ? నను వాఁడెదఁ జేర్చి న లెస్స ! కానిచో
నెదుటికి వచ్చి నిన్ను వరియింపను పొమ్మని పల్కునేని - నా
హృదయము రాయి చేసికొని యిమ్మెయి వీడెద వాని సన్నిధిన్

10. మ. విలిపుత్తూర నిపేరుఁ గాంచిన పురిన్ వేంచేసి యున్నట్టివి
ర్మలుబారిత్రుఁడు విష్ణుచిత్తుసుత, రామారత్న, మాండాళు, గో
కుల దీపంబగుకృష్ణు(గూర్చి పది వాక్పుష్పంబులంగూర్చెని
శ్చలతన్ దీని బఠించు వాఁడు కడచున్ సంసార ఘోరాంబుధిన్

## పదునాల్గవ దశకము

1. మ. హలితమ్మొండనటంచు దర్పమున నల్లాఁ బోతురీతిన్ వన
స్థలి స్వేచ్ఛా గతి సంచరించు జలదశ్యాముఁ హరిన్ గంటిరే ?
యెలమిన్ గోవుల ఁ గాచి వానికిని నెంతే ఁ బ్రీతితో మేఁతయున్
జలము న్ బెట్టు మురారిఁ గంటి మిప్రశస్తంబైన బృందావనిన్

2. మ. విరహోబ్ధిన్ నను ముంచి గోపికలతోఁ బ్రేమక్రియల్ సల్పుచున్
వరబాలర్షభమట్లు తిర్గుయువకున్ నందాత్మజున్ గంటిరే !
మెఱుంపున్ మేఘముఁ గూడు చందమునఁ దన్మిత్రాలితోఁగ్రాలుసుం!
దరదేహున్ వనమాలిఁ గాంచితిమి హృద్యంబైన బృందావనిన్

3. మ. తన సౌందర్యముఁ జూచి గోపికల చిత్తంబుత్తలంబొంద - వా
రిని ప్రేమించునటుల్ నటించు కితవున్ శ్రీకృష్ణునింగంటిరే !
తనపై నెండను సోకనీయక గరుత్మత్పక్షమున్ గొడ్గుగాఁ
గొనిపై నుండి యుడిగ్గఁ గంటి మనఘున్ గోవిందు బృందావనిన్

4. మ. ఘన సంస్పర్శ సరోజముల్ విరియు వీక్షన్, నేత్రపాశంబునన్
నను బంధించిన పంకజాతనయునున్ సర్వేశ్వరున్ గంటి రే !
కనకాలంకృత మౌక్తి కాస్తరణ రేఖల్ పొల్చు మాద్యద్గజేం
ద్రుని లీలన్ విహరింపఁ గాంచితిమి కృష్ణున్ జిష్ణు బృందావనిన్

5. మ. రమణీయోజ్జ్వల నీల రత్నము వలెన్ రాజిల్లుచున్ బంధము
క్త మహా క్రోడము వోలెనొప్పు పురుషున్ దామోదరున్ గంటి రే ?
కమనీయంబగు పీత వస్త్రము పయిన్ గ్రాలంగ గార్మబ్బు చం
దమునన్ బొల్చిన వానిఁ గంటి మి పవిత్రంబైన బృందావనిన్

6. మ. తనశార్ఙ్గంబటు కన్బొమల్ మెఱయుఁ గా ధర్మంబు పాటింప కం
గనలన్ వేఁచెడు గోపబాలునిస్మరాకారున్ గనుంగొంటిరే ?
వనజాతాయతలోచనంబు, జలము గ్వర్ణంబు మార్తాండుఁబో
లిన కాంతిన్ గల వానిఁజూచితిమి కేళీలోలు - బృందావనిన్

7. మ. కమలాక్షున్ గరుణాలవాలు ని నిజాంగంబట్ల స్వీయాంతరం
గము నీలచ్ఛవినొప్పు వాని, వరమేఘశ్యామునిన్ గంటిరే ?
రమణీయోడుగణాన్వితంబయిన యభ్రంబట్లు తన్మిత్రమ
ధ్యమునన్ బొల్చిన కృష్ణుఁజూచితిమి రమ్యంబైన బృందావనిన్

8. మ. సరసీజాసన ముఖ్యవందితుని భాస్వత్ శంఖ చక్రాయుధున్
దరుణీ మన్మధుఁబీత వాసుని యశోదా పుత్రకుంగంటిరే !
వర సౌరభ్యము వల్చు ముంగురు లళుల్ పై గొన్న భంగిన్ భుజో
పరిరాణించు ము కుందుఁగాంచితిమి దివ్యంబైన బృందావనిన్

9. మ. భువనానీకము సృష్టిసేయ నలువన్ బుట్టించి యప్పద్మసం
భవుఁదన్నాభిని నిల్పినట్టి యనఘుఁ బద్మాపతిఁ గంటిరే ?
యువలీలఁ బకధేనుకాసురుల సంహారించి మత్త ద్విప
ముల్ము వడిఁ గూల్చిన కృష్ణుఁగంటిమి భువిఁ బొల్పారు బృందావనిఁ

10. సీ. గ్రాహంబు చేఁజిక్కి కాలు బాధింపఁ గా
శరణము జొచ్చిన సామజమును,
దయతోడ రక్షించి తనదు వాత్సల్యంబు
వెల్లడించిన యదు వల్లభుండు,
చెలఁగి బృందావన క్షేత్రరాజంబున
సాక్షాత్కరించి నచందమెల్ల
శ్రీ విష్ణుచిత్తుని ప్రియ పుత్రి - ఆండాళు
పల్కిన చక్కని పాశురములు

గీ. జననరోగాపనోదనౌషధముటంచుఁ
జిత్తముననెంచి మననంబు సేయువారు
శ్రీ మహావిష్ణు పాదాబ్జ సేవ కలిగి
యనుదినంబు బ్రహ్మానంద మనుభవింత్రు :

★ సమాప్తము ★

**శ్రీ ఆండాళ్ తిరువడిగళే శరణమ్**

★★★★

## వాళి తిరునామము :

సీ. పూర్వ ఫల్గుని యందు పుట్టువు నొందిన
శతపత్ర నేత్రకు జయము జయము ;
ముప్పదులున్న తిరుప్పావుఁ జెప్పిన
సన్నుతగాత్రికి జయము జయము ;
హరిభక్తుఁడా పెరియాళ్వార్లు పెంచిన
సౌశీల్యరాశికి జయము జయము ;
పుణ్యాత్ముఁడగు పెరుంబూదూరు మునికను
జన్మమైనసతికి జయము జయము ;
గీ. పరఁగ నూట నల్వది మూడు పాశురములు
సంతరించిన కాంతకు జయము జయము
రంగనాథునిపత్నియై క్రాలుగోద
చరణరాజీవయుగళికి జయము జయము!.

## అంకితము

సీ. ఏరామువిల్లి పుత్తూరులో విష్ణుచి
త్తాఖ్యుని పుత్రియై యవతరించె ;
నే సతీమణి ధరియించిన వనమాల
శ్రీరంగశాయి కిఁ బ్రీతిఁ గూర్చె;
నేవరవర్ణిని ద్రావిడామ్నాయంబు
శోభిల్లఁజేసె సంస్తుతులొనర్చి;
యేమాత సత్కటాక్షేక్షణములలోన
నఖిలజనంబుల కభయరక్ష;
గీ. యట్టి గోదారమణి నాచ్చియార్ తిరుమొళి
నా ద్రవిడ భాషస్తోత్రంబొనర్చె - దానిఁ
దెలుఁగు సేసెడు భాగ్యంబు గలిగెనాకు
నంకితము సేతునాతల్లియంఘ్రులకును

శ్రీ ఆండాళ్ చరణములే శరణము



కవి దంపతులు

తి. విం. పార్థసారధి అయ్యంగార్ తి. విం. కల్యాణమ్మాళ్